# శ్రీకృష్ణకర్ణామృతము

## ( నవనీతము )



సంకలనము, భావానువాదము :

డాక్టరు ఆ॥ రాఘవరావు, M.S., F.I.C.S., F.I.M.S.A.,

**Surgeon & Professor**

ప్రకాశకులు :

శ్రీ వాసుదేవ భక్త సంఘము

గుంటూరు.

మార్గశిర శుద్ధ ఏకాదశి
(గీతాజయంతి)

5-12-92

ప్రతులు : 1000

ప్రతులకు :

డా॥ A. రాఘవరావు M. S.

ఆర్. అగ్రహారము,

గుంటూరు-3.



ముద్రణ :

వెల్‌కమ్ ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్,

గుంటూరు-2. ఫోన్ : 31686



623. Radha Krishna Gou Pooja J.B. KHANNA & Co.,

# భగవత్ప్రార్థన

శ్రియఃపతే

మా చిత్తము సర్వకాల సర్వావస్థలయందును మీ పాదారవిందములందు లగ్నమై అచంచలమైన భక్తితో కూడి యుండునట్లు అనుగ్రహింపుము.

**పరమదయానిధీ !**

ప్రాతఃకాలమున నిద్రలేచినది మొదలు మరల పరుండు వరకును మనోవాక్కాయములచే మా వలన ఎవరికిని అపకారము కలుగకుండునట్లును, ఇతర ప్రాణికోట్లకు ఉపకారము చేయులాగునను సద్బుద్ధిని దయచేయుము.

**చిదచిదీశ్వరా !**

మా యంతఃకరణమునందు ఎన్నడును ఏ విధమైన దుష్ట సంకల్పముగాని, విషయవాసనగాని అజ్ఞానవృత్తిగాని జొరబడకుండునట్లు దయతో అనుగ్రహింపుడు.

**వేదాంతవేద్యా ! అభయస్వరూపా!**

మా యందు భక్తి జ్ఞాన వైరాగ్యబీజము లంకురించి, శీఘ్రముగా ప్రవృద్ధములగునట్లు ఆశీర్వదింపుడు. మరియు ఈ జన్మమునందే కడతేరి మీ సాన్నిధ్యమున కేతెంచుటకు వలసిన శక్తి సామర్థ్యములను కరుణతో నొసంగుడు.

**దేవా !**

మీరు భక్తవత్సలురు. దీనులపాలిటి కల్పవృక్షస్వరూపులు. మీరుతప్ప మాకింకెవరుదిక్కు ? మిమ్ములను ఆశ్రయించితిమి. ఇదే మా వినతి. అనుగ్రహింపుడు. మీ దరిజేర్చుకొనుడు.

పాహిమాం, పాహిమాం, పాహిమాం, పాహి.



స్వామి పరివ్రాజకాచార్య
(బ్రహ్మసాయుజ్యులు) సదానంద సరస్వతి
సంస్థాపకులు U. C. Y. L. – Holland
(Universal Confluence of Yoga Vedanta Luminary)
మరియు
ఈ గ్రంథకర్త డా॥ రాఘవరావుగారి ఆచార్యులు

# సమీక్ష

అస్మద్గురుభ్యోనమః

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీకృష్ణకర్ణామృతము, శ్రీకృష్ణలీలాతరంగిణి, గీతగోవిందము - ఈ మూడు గ్రంథములును శ్రీమద్భాగవత తాత్పర్యములు. శ్రీ వాసుదేవుని దివ్యలీలా విలాసములన్నియు ఈ గ్రంథములందు భాసించి స్వయంప్రకాశమానములై కర్ణామృతములైనవి. కులశేఖరుని ముకుందమాల అమ్లాన నిత్యపరిమళోల్లాసము. ఈ మొత్తమును పోతరాజ భాగవత మహాసరస్సులోని పద్యతరంగమాలలందు దర్శించి ఆనందింపగలము.

ఈ కృష్ణకర్ణామృతమును ఎందరెందరో వ్యాఖ్యానించినారు. విశేషించి వంగదేశీయులు, తరువాత ఆంధ్రదేశీయులు.

"నరాణాం క్షీణపాపానం కృష్ణే భక్తిః ప్రజాయతే" అన్న పురాణవచనమునందు అసత్యము లేశముకూడ లేదు. ఆ కోవలోనివాడే ఈ లీలాశుకుడు.

శ్రీకృష్ణకర్ణామృత కర్త కేరళీయుడనియు, నీలీ - దామోదరుల పుత్రుడనియు, బిల్వమంగలం ఇంటిపేరనియు,

లీలాశుకుడని నామధేయమనియు, మహా విద్వాంసుడనియు, మహాకవియనియు, శ్రీకృష్ణసందర్శనముచేసిన మహాభక్తుడనియు తెలియబడినది.

'సారంగరంగదా' వ్యాఖ్యాత ననుసరించి, ఈతడు చింతామణి అను వేశ్యయందాసక్తుడై తదేక జీవనుడైయుండగా ఆవలితీరమునయున్న చింతామణికొరకు అర్ధరాత్రి చీకటిలో ప్రయాణమైనాడు. నదిని దాటుటకు సాధనములులేవు. ఒక శవమును తెప్పగా జేసి, దాని ఆధారముగా చింతామణి గృహమునకు చేరినాడు. వర్షముగురియుచుండ నిశిరాత్రివేళ తన గృహమునకేతెంచిన ఆతనినిచూచి చింతామణి ఆశ్చర్యము, భయమును పొంది "తమరు మహాపండితులు, మహాకవులు, మహాభక్తులు శ్రీకృష్ణస్వామియందు ఈ భావము నుంచిన ఎంత మేలు"అని ప్రేమతో వెరపుతో పలికినది. మరునాడు తన గురువైన సోమగిరి యను వైష్ణవ సన్యాసికడకు తీసుకొనిపోయినది. ఆతడు గోపాల చింతామణి మంత్రము నను గ్రహింపగా తదనుష్ఠానబలముచే శ్రీకృష్ణానుగ్రహముచేత లోకప్రసిద్ధమైన శ్రీకృష్ణకర్ణామృతమును రచించినాడు.

శ్రీకృష్ణభక్తిప్రాణమైన కర్ణామృతమునందలి ప్రధాన శ్లోకములను భక్తుల కరకమలములలో నుంచినవారు "వైద్యరత్న" శ్రీ అనుమాలసెట్టి రాఘవయ్యగారు. వీరు మహా

వైద్యులేగాక గుంటూరు వైద్యకళాశాల ప్రధానాచార్య పదము నలంకరించినారు. కేవలము భౌతికవైద్యమేకాక ఆత్మ వైద్యమునందుకూడ మిక్కిలి చతురులు. వీరు అనువత్సరము ఒక ఉత్తమగ్రంథమును ప్రకటించి లోకమునకు మహోపకారము చేయుచున్న లోకమిత్రులు. ఈ దంపతుల శాంతస్వభావము, నమ్రత, పరోపకారబుద్ధి – ఆశ్చర్యమును కలిగించును. ఇట్టి వీరు నాకు ఆప్తమిత్రులగుట నా అదృష్టము.

ఈ కర్ణామృత నవనీతమును చక్కని తాత్పర్యము వ్రాసి మహోదారముగా నందించిన వీరి త్యాగము ప్రశంసార్హము.

"నారాయణేతి శబ్దోస్తి వాగస్తివశవర్తినీ
తథాపి నరకే ఘోరే పతన్తీతి కిమద్భుతమ్ ॥"

భవదీయుడు

శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులు

# మనవి

ఓం నమో భగవతే వాసుదేవాయ !

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥

నమామి నారాయణ పాదపఙ్కజం
కరోమి నారాయణ పూజనం సదా ।
వదామి నారాయణ నామనిర్మలం
స్మరామి నారాయణ తత్త్వమవ్యయం ॥

శ్రీకృష్ణకర్ణామృతము సర్వులు ఆస్వాదింపదగినదే. ఈ గ్రంథము విశేషముగా రసికులైన భక్తులకు పరమాదరణీయము. దక్షిణదేశమందలి ఒక దేవాలయమున భక్తులు దీనిని పఠించుచుండగా శ్రీకృష్ణచైతన్య మహాప్రభువు విని ఆనందించి ప్రతిని సేకరించి జగన్నాథ క్షేత్రమున భక్తులకు తెలిపిరి. భక్తులెల్లరు దానిని కంఠస్థము, హృదయస్థము కావించి ఆస్వాదనము చేసిరి.

మూడు ఆశ్వాసాలలో రచించిన 328 శ్లోకముల ఉత్తమ భక్తికావ్యం. రచయిత లీలాశుకుడు, కేరళ దేశీయుడు. 12 వ శతాబ్దమునకు చెందినవాడు. ఈతడు యౌవ్వనంలో భోగ

లాలస జీవనం గడిపినాడనీ, ఆపై వైరాగ్య సంపన్నుడై సన్యాసాశ్రమం స్వీకరించినాడని నుడివిడి.

లీలాశుకుడు గొప్ప విష్ణుభక్తుడు. బాలకృష్ణుడంటే ఈతనికి అమితప్రీతి. అతి లలితమైన పదాలతో కూర్చిన ప్రతి పద్యంలోను బాలకృష్ణుడు ఏదో నొకరూపములో మనకళ్ళకు కట్టినట్లుగా కనబడేటట్లు వర్ణిస్తాడు ఈ మహాకవి.

బిల్వమంగళుడు మహాపండితుడు. ఆచార సంపన్నుడు నిరతము శ్రీరమావర పాదకమల సేవాసక్తుడు. గురుజనం బుల పూజించువాడు. అపరశుకుడను పేరు వహించినాడు. సద్గుణుడు నిర్మల చిత్తుడు. తండ్రియానతి మూళిధరించి నిరతము వర్తించుచుండెడివాడు. భార్య సాధ్వీమణి.

చింతామణి వేశ్య, సహజసౌందర్యవతి. ఆమె అను రాగమునకు వశమైనాడు. చింతామణి వ్యామోహము బిల్వ మంగళుని ప్రపంచమునే మఱపించినది. కొంత సమయమునకు స్త్రీసౌందర్యమేదో ఎఱుకపరుచుటకై తాను అలంకార రహితయై ప్రవేశించి తాను ఎట్టి సౌందర్యవతినో పరికించమని బిల్వమంగళు నుద్దేశించెను. అంధకారమునుండి జ్ఞానోదయము పొందిన బిల్వమంగళుడు ఆమెనుద్దేశించి 'నన్ను కృతార్థుని జేయదలచిన జ్ఞానస్వరూపిణివని' నమస్కరించెను. స్వప్నమున శ్రీకృష్ణుడు తనకు ప్రబోధముచేసినాడని చింతామణి అతనికి మనవిజేసెను. ఎనలేని పశ్చాత్తాపముతో ఆచార్యుడగు సోమ

గిరి యోగిని సమీపించెను. అంతనా యోగి 'బిల్వమంగళా ! జ్ఞానోదయముచే నీవు కృతార్థుడవై నీవిక లీలాశుకుండవన బరగెదవని వాసుదేవ మంత్రము నుపదేశించెను.

అప్పై ఆ పారమార్థిలో ఆయన శ్రీకృష్ణకర్ణామృత దివ్య స్తోత్ర కావ్యమును రచించెను.

శ్రీ లీలాశుకుని ఈ కర్ణామృతము అమృతభాండాగారము ఈ అమృతములోని ఒక్క బిందువునైనను ఆస్వాదించినవాడు సాంసారిక ద్వంద్వములనుండి ముక్తుడగును. గృహస్థాశ్రమము పాటించుచున్నను కడపటకు భగవానుని శరణుజేరును.

బహుళగ్రంథమును గ్రహించలేనివారైనను ఈ కర్ణామృత - నవనీతమును ఆస్వాదించి తరించెదరనెడి భావనతో కొన్ని ముఖ్య శ్లోకములను కూర్చి భావానువాదముతో ఈ నవనీతమును ప్రచురించితిని.

ఆధారముగా - సురభారతీ సమితివారు ప్రచురించిన గ్రంథమును, శ్రీ గాడిచర్లవారి గ్రంథమును సంప్రతించితిని. ఈ కృష్ణకర్ణామృత నవనీతమును భక్తుల కరకమలమందుంచు భాగ్యము నాకు ఆ భగవానుడు ప్రసాదించినందుకు నేను ధన్యుడను.

ఈ చిన్ని గ్రంథమును పరిశీలించి తదనుగుణమగు లోపములను సవరించి ఆమోదముద్ర గావించిన శ్రీ వ్యాకరణం లక్ష్మీకాంతశాస్త్రిగారికి నా కృతజ్ఞతలు. శ్రీ వాసుదేవ భక్త సంఘ సభ్యులెల్లరకు, ఆచార్యులగు శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులువారు అనుగ్రహముతో సమీక్షవ్రాసి నాకు ఆశీస్సులనందచేసిరి. వారికి నా నిత్యకృతజ్ఞతలు.

కడు శ్రద్ధతో ముద్రణగావించిన వెల్‌కం ప్రెస్ అధినేతలకు వారి కర్మచారులకు సదా నా వందనములు.

భగవంతుని సాన్నిధ్యాన్ని చేరడానికి భక్తి సులభ సాధనం భక్తినిండిన మనస్సులో భగవంతుడు సదా నివసిస్తాడు.

భగవంతుడు భక్తికి వశ్యుడు. ఇది సత్యం.

ఆపై ముక్తికి దోహదంచేసేవి భగవద్భక్తి, భాగవత మైత్రి, భూతదయ మున్నగునవి. వీని నలవరచుకొని జీవన యాత్ర గడుపు జీవి - జీవన్ముక్తుడే.

నా మాతామహులు, వారి భార్య - కీ॥ శే॥ వలివేటి నరసింహంగారు, వలివేటి మహాలక్ష్మమ్మ.

నా మాతృమూర్తి కీ॥ శే। అ॥ వెంకటసుబ్బమ్మ, మా అత్తగారగు కీ॥ శే॥ త్రిపురమల్లు నాంచారమ్మ,

నా చిన్నవయస్సులో అతి ప్రేమాదారములతో నాపై

అతి మక్కువజూపిన కీ॥ శే॥ గుడివాడ ఆంజనేయులుగారు వారిభార్య కీ॥ శే॥ గు॥ నాగరత్నమ్మగార్లకు పరమేశ్వరుడగు కృష్ణపరమాత్మ విష్ణుసాయుజ్యము జేకూర్చ ప్రార్థన.

వీరలందరి స్మృత్యర్థముగా ఈ గ్రంథము వెలువడుట నా భాగ్యము.

జన్మదాతలైన నా పితృమూర్తి శ్రీ అనుమాలశెట్టి రామారావుగారికి, కన్యాదాతలైన శ్రీ తిరునల్లు కాశీవిశ్వనాధంగారికి పరమాత్మ, ఆయురారోగ్యములు సుఖశాంతుల నొసంగి మేమెల్లవేళల ధర్మపథమున వర్తించునట్లు అనుగ్రహింప వేడుచున్నాను.

హరివార్త లెరుగువారికి
హరి పదములు దలచువారి కనవరతంబున్
హరికథలు వినెడివారికి
మరణాగత మహాసంభ్రమము లేదనఘా !

ఓం తత్ సత్

ఏతత్ సర్వం శ్రీ రుక్మిణీసహిత
శ్రీకృష్ణపరమాత్మార్పణమస్తు ।

ఇట్లు
భవదీయుడు
డా॥ అనుమాలశెట్టి రాఘవరావు

# శ్రీకృష్ణ కర్ణామృతము

## (శ్రీ లీలాశుక విరచితము)



### 1

అస్తి స్వస్తరుణీకరాగ్రవిగల త్కల్పప్రసూనాప్లుతం
వస్తు ప్రస్తుతవేణునాదలహరీ నిర్వాణనిర్వ్యాకులం ।
స్రస్త స్రస్త నిరుద్ధనీవివిలసద్గోపీ సహస్రావృతం
హస్తన్యస్తనతాపవర్గమఖిలోదారం కిశోరాకృతి ॥ 1

దేవతా స్త్రీల హస్తాగ్రములనుండి జారు కల్పవృక్ష పుష్పములచే ఆవరింపబడినదియు, గోపికలమనస్సును హరించునట్టి వేణునాద లహరుల నుండి ఉద్భవించి పరమానందముచే నిశ్చలమైనదియు, జారెడు పోకముడులను నిరోధించు గోపీజన సహస్రముచే పరివేష్టింపబడినదియు, శరణాగతులకు అభయ మొసగునదియు, అతి ఉదారమైనదియు, కిశోరాకారము కల దియు నగు నొకవస్తువు బృందావనమున నిత్యము విరాజిల్లు చున్నది.

ముకులాయమాన నయనాంబుజ విభో
ర్మురలీనినాద మకరంద నిర్భరం ।
ముకురాయమాణ మృదుగండ మండలం
ముఖపంకజం మనసిమే విజృంభతాం ॥ 2

అరమోడ్పు కన్నులుగలదియు, వేణునాద భరితమైన దియు, సొగసైన చెక్కిళ్ళుగలదియునగు శ్రీకృష్ణుని ముఖార వింధము నా మనస్సున స్ఫురించుగాక !

నిఖిలభువన లక్ష్మీ నిత్యలీలా స్పదాభ్యాం
కమలవిపిన వీథీగర్వ సర్వంకషాభ్యాం ।
ప్రణమదభయదాన ప్రౌఢిగాఢా దృతాభ్యాం
కిమపి వహతు చేతః కృష్ణపాదాంబుజాభ్యాం ॥ 3

సర్వలోకములందలి శ్రీ మహాలక్ష్మీదేవి నిత్య లీలలకు ఆశ్రయములైనవియు, పద్మవన శ్రేణులకన్న మిన్నయైనవి యును, భజించు జనులకు అభయదానము చేయునవియునగు శ్రీకృష్ణుని పాదపద్మములు నా మనస్సున కమితానందమును కలిగించుగాక !

మణినూపురవాచాలం వందేతచ్చరణంవిభోః ।
లలితాని యదీయాని లక్ష్మాణి వ్రజవీథిషు ॥ 4

వ్రేపల్లెలోని వీధులయందు అంతట మణిమయములగు అందెల ధ్వనులచే మ్రోగు శ్రీకృష్ణుని చరణములకు నమస్కరించుచున్నాను.

కారుణ్యకర్బుర కటాక్ష నిరీక్షణేన
తారుణ్య సంవలిత శైశవ వైభవేన ।
ఆపుష్ణతా భువనమద్భుత విభ్రమేణ
శ్రీకృష్ణచంద్ర శిశిరీకురు లోచనంమే ॥ 5

శ్రీకృష్ణచంద్రా! కరుణారసములకు నీ క్రీగంటిచూపులు, జగత్తును పోషించుచున్న నీలీలావిలాసములు, యౌవనభరిత మగు నీ బాల్యవైభవములతో నా కన్నులకు ఆనందము కలుగజేయుము!

నిబద్ధమూర్ధాఞ్జలిరేష యాచే
నీరన్ధ్రదైన్యోన్నతిముక్తకణ్ఠం ।
దయానిధే దేవ భవత్కటాక్ష
దాక్షిణ్యలేశేన సకృన్నిషిఞ్చ ॥ 6

కరుణాసాగరా! దేవా! శ్రీకృష్ణా! నీ క్రీగంటిచూపుల ఔదార్యముతో నన్ను అనుగ్రహింపమని దీనుడనై, ముక్త కంఠముతో రెండు చేతులనెత్తి వేడుచున్నాను.

హే దేవ! హే దయిత! హే జగదేకబన్ధో!
హే కృష్ణ! హే చపల! హే కరుణైకసిన్ధో!
హే నాథ! హే రమణ! హే నయనాభిరామ!
హా! హా! కదాను భవితాసి పదం దృశోర్మే ॥ 7

ఓ దేవా! దయాళో! లోకైకబంధో! హే కృష్ణ కరుణా సముద్రా! ఓ స్వామీ! హే రమణా! నయనాభిరామా! నా నేత్రముల కెపుడు విషయమగుదువో? (దర్శనభాగ్యము నెప్పుడు నిత్తువో గదా!)

లీలాయితాభ్యాం రసశీతలాభ్యాం
నీలారుణాభ్యాం నయనాంబుజాభ్యాం ।
ఆలోకయే దద్భుత విభ్రమాభ్యాం
కాలేకదా కారుణికః కిశోరః ॥ 8

విలాసములచే విశాలములైనవియు, ప్రేమరసావాహినిచే చల్లనైనవియు, నయనకాంతులచే నీలమేఘమువోలెనవియు, కనుగొలకుల ఎఱుపుచే ఎఱ్ఱనివియు, సంభ్రమ భరిత విలాసములు గలవియునగు కన్నుతామరలచే దయాసముద్రుడైన బాలకృష్ణుడు నన్నెపుడు వీక్షించునో !

బహులచికురభారం బద్ధపిఞ్ఛావతంసం
చపలచపలనేత్రం చారుబింబాధరోష్ఠం
మధురమృదులహాసం మందరోదారలీలం
మృగయతి నయనం మే ముగ్ధవేశం మురారేః ॥ 9

దట్టమగు కేశ సమూహమును, శిరోభూషణమగు నెమలి పింఛమును, చంచలములైన దృష్టిని, అందమగు పెదవులను, కోమలమగు చిరునగవు గలిగి, మందరపర్వతముబోలు ఉదారమైనదియు, మనోహరముగ ప్రకాశించు శ్రీకృష్ణుని చూచుటకు నా నేత్రములు ఆరాటపడుచున్నవి.

కరకమల-దల-కలిత లలితతరవంశీ -
కలనినద-గలదమృత-ఘనసరసిదేవే !
సహజ-రసభర-భరితదరహసిత-వీథీ-
సతత-వహదధరమణి మధురిమణిలియే ॥ 10

పద్మమువంటి చేతియందు ధరించిన సుందరమైన వేణువు మధురస్వరమునుండి వెలువడు అమృతమునకు భాండారము వంటివాడును, సహజసౌందర్య చిరునగవును, ఎల్లెడలదాల్చు కెంపువంటి అధర మాధుర్యముగల శ్రీకృష్ణునియందు లీనమగుచున్నాను.

తత్కైశోరం తచ్చ వక్త్రారవిన్దం
తత్కారుణ్యం తే చ లీలాకటాక్షాః
తత్సౌన్దర్యం సా చ మన్దస్మితశ్రీః
సత్యం సత్యం దుర్లభం దైవతేషు ॥ 11

శ్రీకృష్ణుని బాల్యము, తామరవంటి యా ముఖబింబము, కరుణా విలాసముతో గూడిన ఆ క్రీగంటిచూపులు, ఆ సౌందర్యము, ఆ చిఱునగవు సొగసును, దేవతలయందు గానబడవు. ఇది సత్యము. సత్యము.

చికురం బహుళం విరళం భ్రమరం
మృదులం వచనం విపులం నయనం ।
అధరం మధురం వదనం మధురం
చపలం చరితం చ కదా ను విభోః ॥ 12

శ్రీకృష్ణుని దట్టమైన జుట్టును, పలుచని ముంగురులును, మృదువైన పలుకులను, విశాల నేత్రములును, మధురమగు పెదవిని, సుందరవదనమును, చంచలమగు నడవడిని ఎప్పుడు అనుభవింతునో ?

తేజసేస్తు నమో ధేనుపాలినే లోకపాలినే
రాధాపయోధరోత్సఙ్గశాయినే శేషశాయినే ॥ 13

గోవులను, జగములను గాచుచు రాధాదేవి వక్షస్థలము పైనను, ఆదిశేషునిమీదను బవ్వళించు తేజస్స్వరూపమగు కృష్ణాఖ్య బ్రహ్మమునకు నమస్కరించుచున్నాను.

త్రిభువనసరసాభ్యాం దివ్యలీలాకులాభ్యాం
దిశి దిశి తరలాభ్యాం దీప్తభూషాదరాభ్యాం ।
అశరణశరణాభ్యా మద్భుతాభ్యాం పదాభ్యా -
మయమయమనుకూజద్వేణురాయాతి దేవః ॥ 14

త్రిలోకములలోను శృంగారరసమును విస్తరింపజేయు దివ్యలీలలతో నిబిడీకృతమైనవియు, నలుదిశల చంచలగతి విశిష్టములైనవియు, సుందరముగా ప్రకాశించు నూపురాది భూషణములకు ఆదరమైనవియు, అనాథులకు శరణ్యమగు పాదములతో, శ్రీకృష్ణుడు వేణునాదము చేయుచు, వేంచేయు చున్నాడు.

సోఽయం మునీంద్రజన మానసతాపహారీ
సోఽయం మదవ్రజవధూవసనాపహారీ ।
సోఽయం తృతీయ భువనేశ్వరదర్పహారీ
సోఽయం మదీయ హృదయాంబు రుహాపహారీ ॥ 15

మునిజనుల తాపమును హరించువాడును, గోపికల వస్త్రముల నపహరించినవాడును, ఇంద్రుని గర్వభంగము చేసిన వాడును, నా హృదయకమలములను దోచినవాడును-ఆ పరమ పురుషుడీతడే !

చిత్రం తదేతచ్చరణారవిందం
చిత్రం తదేతన్నయనారవిందం
చిత్రం తదేతద్వదనారవిందం
చిత్రం తదేతద్వపురస్య చిత్రం ॥ 16

శ్రీకృష్ణుని పాదారవిందము విచిత్రమైనది, నయనారవిందము, ముఖారవిందము, శరీరము అతి అద్భుతమైనవి.

అఖిలభువనైక భూషణమధి -
భూషిత జలధి దుహితృకుచకుంభం ।
వ్రజయువతీహారవల్లీ మరకత
నాయకమహామణిం వందే ॥ 17

సర్వలోకములకు భూషణమైనవాడును, శ్రీమహాలక్ష్మికి శోభకూర్చు వక్షస్థల ఆభరణమంటివాడును, గోపికలహారములకు నాయకమణివంటివాడగు శ్రీకృష్ణుని నమస్కరించుచున్నాను.

మధురం మధురం వపురస్యవిభో
ర్మధురం మధురం వదనం మధురమ్ ।
మధుగన్ధి మృదుస్మితమేత దహో
మధురం మధురం మధురం మధురం ॥ 18

చూడజూడ అతి సుందరమైన మేనును, తేనెయుల్గారు చిఱునవ్వు గులుకుచు, చూడజూడ సొగసైన ముఖారవిందము గలిగిన ఈ శ్రీకృష్ణరూపమగు తేజస్సు చూచుటకు మిక్కిలి మంథరమైయున్నది.

శృంగారరససర్వస్వం శిఖిపిఞ్ఛవిభూషణం
అంగీకృతనరాకారమాశ్రయే భువనాశ్రయం ॥ 19

శృంగారరసమునకు సర్వస్వమైనవాడును, నెమలిపింఛము నాభరణముగాగలవాడును, పురుషునిరూపము నాశ్రయించినవాడు, లోకములకు ఆశ్రయమైనవాడునగు శ్రీకృష్ణుని ఆశ్రయించుచున్నాను.

మందారమూలే మదనాభిరామం
బింబాధరపూరిత వేణునాదం ।
గోగోప గోపీజన మధ్యసంస్థం
గోపం భజే గోకుల పూర్ణచంద్రమ్ ॥ 20

కల్పవృక్షమూలమున గోవులు, గోపికలు, గోపాలకుల నడుమనుండి కెమ్మోవిచే బిల్లంగ్రోవిని మ్రోయించుచు, మన్మధునివలె జక్కనివాడై ద్రేపల్లెకు పూర్ణచంద్రునివలె ఆహ్లాదమును గలిగించు (ఆ)గోపాలకృష్ణుని భజించెదను.

భువనం భవనం విలాసినీ శ్రీ
స్తనయస్తామరసాసనః స్మరశ్చ ।
పరిచార పరంపరా సురేంద్రా
స్తదపి త్వచ్చరితం విభో విచిత్రం ॥ 21

ఓ కృష్ణా నీకు జగత్తు నివాసగృహము. ప్రియముచేకూర్చు ఇల్లాలు శ్రీమహాలక్ష్మి, బ్రహ్మయు, మన్మధుడును, నీ కొమరులు, ఇంద్రాదులు పరిచారకులు, ఇంతటి సంపత్తి, వైభవము గలిగిన ప్రభుండవయ్యు, నీ అమోఘలీలలు జూడ మిక్కిలి ఆశ్చర్యమగుచున్నది.

ప్రేమదం చ మే కామదం చ మే
వేదనం చ మే వైభవం చ మే ।
జీవనం చ మే జీవితం చ మే
దైవతం చ మే దేవ నా పరమ్ ॥ 22

ప్రేమజూపుటకును, కామితార్థము లీడేర్చుటకును, బుద్ధిని ప్రసాదించుటకును, సంపదలొసంగుటకును, ప్రాణము నిలబెట్టుటకును, జీవితయాత్ర జరుపుటకును, దైవమని మ్రొక్కి శరణుజొచ్చుటకును - శ్రీకృష్ణా! నీవుతప్ప నాకు మరెవ్వరు లేరు !

జయ జయదేవ కృష్ణ రిపుసైన్య మహార్ధరి భేదకృద్ధనం
జయ జయకారణా భువనసన్నుత శోభననామధేయ సం
జయ జయబోధసాధకవచః శ్రుతినేత్ర మనోమనోహరా
జయ జయవిశ్వజన్మలయశాసన గాఢతమో నిరాసనా ! 23

ఓ కృష్ణా! శత్రుసైనికుల గర్వమును అణచివేయుటకు ధనమువంటివాడా! అభిన్న నిమిత్తోపాదానమైనవాడా! లోక ములచేత స్తుతింపబడినవాడా ! పుణ్యప్రదమైన నామముకల వాడా! అజ్ఞానవిజయమును బోధించువాడా! ఉపాసకుని వాక్కు నకు, స్తోత్రములకు, నేత్రములకు, మనస్సునకు సుందరుడైన వాడా! ప్రపంచముయొక్క సృష్టి, స్థితి, లయములను శాసించు వాడా ! దట్టమగు అజ్ఞానతిమిరమును నశింపచేయు కృష్ణా ! నీకు విజయము కలుగుగాక !

జయ జయ జయ దేవ దేవ దేవ
త్రిభువన మంగళ దివ్యనామధేయ ।
జయ జయ జయ బాలకృష్ణదేవ
శ్రవణ మనోనయనామృతావతార ॥ 24

ఓ దేవా! నీకు జయమగుగాక! జయమగుగాక! జయమగుగాక! ముల్లోకములకు నీ దివ్యనామము మంగళము చేకూర్చుగాక! బాలకృష్ణదేవ! నీకు జయమగుగాక! జయమగుగాక! జయమగుగాక! నీవు మనో, నేత్రములకు, శ్రవణేంద్రియములకు అమృతావతారమైయున్నావు.



## 2

గోధూళిధూసరిత కోమల కున్తలాగ్రం
గోవర్ధనోద్ధరణ కేళి కృత ప్రయాసమ్ ।
గోపీజనస్య కుచకుఙ్కుమ ముద్రితాఙ్గం
గోవింద మిన్దువదనం శరణం భజామః ॥ 1

గోసముదాయముచే ఎగసిన ధూళిచే, కురుల కొనలు బూడిదవన్నెగలవికాగా, గోవర్ధన పర్వతమును లీలగానెత్తిన, యలసటతో గూడి, గోపికల చన్నుగవలయందలి కుంకుమ పూతలు తనమేనియందంటుకొనునట్లు, గాఢాలింగనము చేయగా నయనంబు చంద్రునివలె ప్రకాశించుచున్న శ్రీకృష్ణుని గొలుచుచున్నాము.

దేవకీతనయ పూజనపూతః
పూతనారి చరణోదకధౌతః ।
యద్యహం స్మృత ధనఞ్జయసూతః
కిం కరిష్యతి మే యమదూతః ॥ 2

దేవకి సుతుడై, దుష్టయగు పూతనం జంపి ఆశ్రితుడైన యర్జునునకు సారధ్యము జేసిన కృష్ణుని పూజించి, పాద తీర్థమును గ్రహించి స్మరించితినేని యమకింకరుడు నన్నేమి చేయలేడు,

అఙ్గనామఙ్గనామన్తరే మాధవో
మాధవం మాధవం చాన్తరేణాఙ్గనా ।
ఇత్థమాకల్పితే మండలే మధ్యగః
సఞ్జగౌ వేణునా దేవకీనందనః ॥ 3

ఒక్కొక్క స్త్రీకి నడుమ తానును, తన రెండురూపుల నడుమ నొక్కొక్క స్త్రీయునుగా మండలముగాదీరి నిలచి, వారి మధ్యగూడ తాను వేఱొకడై నిలచి శ్రీకృష్ణుడు శ్రావ్యముగా గానముచేసెను.

క్వాపి వీణాభిరారావిణా కమ్పితః
క్వాపి వీణాభిరాకింకిణీ నర్తితః ।
క్వాపి వీణాభిరామాన్తరంగాపితః
సఞ్జగౌ వేణునా దేవకీనందనః ॥ 4

శ్రీకృష్ణుడు ఒకచోట వీణలువాయించుటకు అనుగుణముగా ఆడుచును, ఒకచో వీణాధ్వనులకు అనుగుణముగా చిఱుగంటలు మ్రోయించుచును మఱొకచోట నడుమ, నడుమ వీణలువాయింపగా బాడుచును వేణుగానము చేసెను.

గోధూళి దూసరిత కోమల గోపవేషం
గోపాలబాలక శతైరను గమ్యమానమ్ ।
సాయన్తనే ప్రతిగృహం పశుబన్ధనార్థం
గచ్ఛన్తమచ్యుతశిశుం ప్రణతోస్మి నిత్యం ॥ 5

గోవులమందచే బుట్టిన ధూళిచే బూడిదవన్నె పాలిన సుకుమారపు గోపాలుని ఆకారము గలిగి వందలకొలది గోపాలకులు తనవెంటరాగా, సాయం సమయమున గోవులనుగట్టుటకు వ్రేపల్లెయందు ఇంటింటను దిరుగుచున్న చిన్నికృష్ణునికి నమస్కరించుచున్నాను.

ముగ్ధం స్నిగ్ధం మధుర మురళీమాధురీ ధీరనాదైః
కారం కారం కరణ వివశం గోకుల వ్యాకులత్వం ।
శ్యామం కామం యువజన మనోమోహనం మోహనాంగం
చిత్తే నిత్యం నివసతు మహోవల్లవీవల్లభం వః ॥ 6

మనోజ్ఞమైన, శ్రావ్యమగు మధురములైన వేణుధ్వనులచే వ్రేపల్లెలోనివారినెల్ల పారవశ్యము గలుగునట్లు, మేఘశ్యాముడై, వయసుకాండ్రనుగూడ వలపించునంత సుందరమై, మనోహరమైన దేహముతోగూడి గోపగోపికలకు ప్రియమైన శ్రీకృష్ణాఖ్య తేజము మా హృదయమందెల్ల వేళల ప్రకాశించుచుండునుగాక !

విక్రేతు కామాకిల గోపకన్యా
మురారిపాదార్పిత చిత్తవృత్తిః ।
దధ్యాదికం మోహవశాదవో చ
ద్గోవింద దామోదర మాధవేతిః ॥ 7

ఒక గోపకన్య వ్రేపల్లెయందు పెరుగు, పాలు అమ్మ బోయి శ్రీకృష్ణపాదారవిందములందే తన మనస్సు లగ్నమగుటచే - పెరుగో, పెరుగో అనుటకు బదులు గోవిందా!, దామోదరా, మాధవా!, యని పలుకుచు దిరిగెనట !

కరారవిందేన పదారవిందం
ముఖారవిందే వినివేశయంతమ్ ।
వటస్య పత్రస్యపుటే శయానం
బాలం ముకుందం మనసాస్మరామి ॥ 8

కరకమలమునఁ బాదకమలమునుబట్టి, ముఖకమలంబున జొనుప్పుచు వటపత్రంబున బవ్వళించు బాలుండైన ముకుందుని మనంబున స్మరించుచున్నాను.

నృత్యన్త మత్యన్త విలోకనీయం
కృష్ణం మణిస్తమ్భగతం ।
నిరీక్ష్యసాక్షాదివ కృష్ణమగ్రే
ద్విధావితేనే నవనీతమేకమ్ ॥ 9

శ్రీకృష్ణుడు మిక్కిలి రమణీయముగా ఆడుచుండగా అతని ప్రతిబింబమును రత్నస్తంభమునందు మిక్కిలి చూడదగి నట్లుగా సొగసైె కనబడగా ఆ ప్రతిబింబమునందలి వ్యామోహామువలన దానినికూడ నిజమగు కృష్ణునివలె భావించి యశోద చేతనున్న వెన్నముద్దను ఇద్దరు కృష్ణులకును రెండుగా బంచెను.

బాలయనీలవపుషే నవకింకిణీక
జాలాభిరామ జఘనాయ దిగంబరాయ ।
శార్దూల దివ్య నఖభూషణ భూషితాయ
నందాత్మజాయ నవనీత ము ే నమస్తే ॥ 10

నీలమేఘపు మేనుగలిగి, క్రొంగ్రొత్త గజ్జెలచే సొగసగుఁ నడుము గలవాడై, దిసిమొలతో, వేలి పులిగోరు దాల్చిన, నవనీత చోరుడు, నందకుమారుడగు బాలకృష్ణునికి నమస్కారము.

కిఙ్కిణి కిణికిణి రభసైరంగణ
భువిరిం గణైః సదాటన్తమ్ ।
ఝుంఝుణుఝుణు పదయుగళం
కంకణకర భూషణం హరింవందే ॥ 11

కిణి కిణి యని చిఱుగంటలు మొరయ బ్రాకులాడుచు, ముంగిట నెప్పుడు దిరుగుచు, ఝుణు, ఝుణు అని అడుగులరెంటి యందును అందియలు మ్రోగగా, చేతులందు కడియములు మెఱయగా నొప్పుచున్న శ్రీకృష్ణమూర్తికి నమస్కరించుచున్నాను.

ప్రహ్లాదభాగధేయం నిగమ
మహాద్రేర్గుహాన్తరాధేయం ।
నరహరి సదాభిదేయం
విబుధవిధేయం మమానుసంధేయం ॥ 12

ప్రహ్లాదుని భాగ్యమై, వేదప్రతిపాద్యుడై, కరుణచే దేవతలను రక్షింప స్తంభమున నవతరించి, నృసింహుడను పేరొందిన పరతత్త్వము నాకు అనుసంధింపదగినది.

సంసారే కిం సారం కంసారే
శ్చరణ కమల పరిభజనం ।
జ్యోతిః కి మన్ధకాలే యద
న్దకారే రను స్మరణమ్ ॥ 13

సంసారమునందు కంసారియగు కృష్ణుని పాదారవిందము లనుభవించుటయే శ్రేష్టము, అజ్ఞానమును బోగొట్టుటకు సదా శివుని స్మరించుటయే మేలైనది.

నమ స్తస్మై యశోదాయా
దాయాదాయాస్తు తేజసే ।
యద్ధిరాధా ముఖాంబోజం
భోజం భోజం వ్యవర్ధత ॥ 14

యశోదకు తనయుడై, యవతరించి రాధాదేవి ముఖారవిందమును మిక్కిలి యాస్వాదించి వర్ధిల్లిన శ్రీకృష్ణాఖ్య తేజమునకు నమస్కారము.

మధ్యే గోకులమండలం ప్రతిదిశం చాంబరవోజ్జృంభితే
ప్రాతర్దోహమహోత్సవే నవఘనశ్యామం రణన్నూపురం ।
ఫాలేబాల విభూషణం కటిరటత్సుకింకిణీమేఖలం
కంఠే వ్యాఘ్రనఖం చ శైశవ కళాకళ్యాణ కార్త్స్న్యంభజే॥ 15

వేకువజామున అతి వేడుకగా పాలుపిదుకునప్పుడు నలు దిశల అంబాయని యఱచుచున్న ఆవుల(గోవుల) సమూహము నడుమ, నీలమేఘమువలె అందియలు కాలియందు మెరయ, కటిగజ్జెలు మ్రోగ, కంఠమందు పులిగోరు విలసిల్ల నొసటి యందలి భూషణము మెరయు శిశువుయొక్క శుభరేఖలన్నియు మిక్కిలి యొప్పారెడు బాలకృష్ణుని భజించుచున్నాను.

స్మిత లలితకపోలం స్నిగ్ధ సంగీతలోలం
లలిత చికురజాలం చౌర్యచాతుర్యలీలం ।
శతమఖరిపుకాలం శాతకుంభాభచేలం
కువలయదళనీలం నౌమి గోపాలబాలం ॥ 16

చిరునగవుచే దెలుపైన చెక్కిళ్లు గలిగి, శ్రావ్యమగు వేణుగాన మందాసక్తుడైన సొగసగు ముంగోరులు వ్రాల, అతి చాతుర్యముతో నవనీతచోర లీలలు నెరపుచు, ఇంద్రుని విరోధులగు రాక్షసులకు యముడై బంగారువన్నె చేలగట్టి కలువరేకులవలె నీలమేఘశ్యాముడై యొప్పు బాలగోపాల కృష్ణుని నుతించుచున్నాను.

మురళినినదలోలం ముగ్ధమాయూరచూళం
దళిత దనుజజాలం ధన్య సౌజన్య లీలం ।
పరహిత నవహేలం పద్మ సద్మానుకూలం
నవజల ధరనీలం నౌమి గోపాలబాలమ్ ॥ 17

మురళీగానమందాసక్తుడై, మురువైన నెమలిపురిని జెరివి, రాక్షససమూహములనుజీల్చి, ఆశ్రితులైన ధన్యులకు, సుజనత్వలీలలుపచరించి, మరియు నితరులకు నూత్నములైన విలాసములు నెఱపుచు, లక్ష్మీదేవికి అనుకూల నాయకుడై, నూతన మేఘమువోలె విలసిల్లు గోపాలబాలుడగు శ్రీకృష్ణుని స్తుతించుచున్నాను.

సరసగుణ నికాయం సచ్చిదానందకాయం
శమిత సకలమాయం సత్యలక్ష్మీ సహాయం ।
శమదమ సముదాయం శాంత సర్వాంతరాయం
సుహృదయ జనదాయం నౌమిగోపాలరాయమ్ ॥ 18

సౌందర్యరాశియై, సత్యజ్ఞానందస్వరూపుడై, రాక్షసాదుల సకల మాయలను దూరించుచు, సత్యసంపన్నులకు సహాయుడై, శమదమాదియుక్తుడై, సర్వవిషములను బోగొట్టుచు, నిర్మలాంతరంగుల పాలిటి భాగ్యమై, గోపాలురకెల్ల నాయకుడై వెలయు కృష్ణుని నుతించుచున్నాను,

లక్ష్మీకళత్రం లలితాబ్జనేత్రం
పూర్ణేందువక్త్రం పురుహూత మిత్రం।
కారుణ్యపాత్రం కమనీయగాత్రం
వందే పవిత్రం వసుదేవ పుత్రం॥ 19

లక్ష్మీదేవిని భార్యగా గలిగి, తామరరేకులంబోలు నేత్రములుగలిగి, పున్నమి చందురుని మోముతోఁగూడి, ఇంద్రుని మిత్రుడై, కారుణ్యనిధియై, సుందరమైన దేహము గల్గి, లోకములనెల్ల పవిత్రముజేయునట్టి వసుదేవుని సుతుడగు శ్రీకృష్ణుని నుతించుచున్నాను.

మదమయ మదమయ యదురగం
యమునామవతీర్య వీర్యశాలీయః।
మమరతి మమరతి రస్కృతి
శమన పరస్పృక్రియాత్కృష్ణః॥ 20

పరాక్రమముతో యమునలోదిగి మిక్కిలి మదించిన కాళీయసర్పమునణచి, దేవతలకు రాక్షసాది గణములచే గలుగు నవమానమును బోగొట్టుటయందాసక్తుడైయొప్పు శ్రీకృష్ణుడు నాకు సుఖమును గలిగించుగాక !

త్వయిప్రసన్నే మమకిం గుణేన
త్వయ్య ప్రసన్నే మమకింగుణేన ।
రక్తే విరక్తే చ వరే వధూనాం
నిరర్థకః కుంకుమ పత్రభఙ్గః ॥ 21

నాథునికి నాయకయందు రక్తిగాని, విరక్తిగాని కలుగు టకు మకరికాపత్రరచన కారణముగానట్లు నీకు నాయందు ప్రసన్నతగాని అప్రసన్నతగాని కలుగుటకు నా గుణము కార ణముకానేరదు. అవి నీకు నీయంతటనే కలుగవలయును.

హే గోపాలక హే కృపాజలనిధే హే సిన్ధు కన్యాపతే
హే కంసాంతక హే గజేంద్ర కరుణాపారీణ హే మాధవ ।
హే రామానుజ హే జగత్త్రయగురో హే పుండరీకాక్ష మాం
హే గోపీజననాథపాలయ పరంజానామి నత్వాంవినా ॥ 22

హే గోపాలకా! హే దయాసముద్రా! ఓ లక్ష్మీనాథా! హే కంసహారకా! గజేంద్రునిపై అమిత కరుణనుచూపిన వాడా! హే మాధవా! బలరాముని తమ్ముడా! ముల్లోకములకు గురు దేవా! తెల్లదామరలుబోలు నేత్రములుగలవాడా! ఓ గోపస్త్రీమనోహరా! ఓ గోపాలకృష్ణా! నన్నుగాపాడుమా, నిన్నుదప్ప మరేమియు నేనెరుగను.

కస్తూరీ తిలకం లలాటఫలకే వక్షస్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరేకంకణం ।
సర్వాంగే హరిచందనంచ కలయన్ కంఠే చ ముక్తావళిం
గోపస్త్రీ పరివేష్టితో విజయతే గోపాలచూడామణిః ॥ 23

లలాటభాగమున కస్తూరిబొట్టు, వక్షస్థలమున కౌస్తుభ మణియు, నాసికాగ్రరన్ధ్రిమున నూతనమైన ముత్తెము, హస్తమున వేణువు, చేతియందు కంకణము, శరీరమందలి సర్వాంగములయందు మంచిగంధమును కంఠమున ముత్యాలహారమును ధరించుచు గోపికలచేత ఆవరింపబడిన గోపాలకృష్ణప్రభువు విజయము పొందుగాక —

యస్యాత్మభూతస్య గురోః ప్రసాదా
దహం విముక్తాస్మి శరీర బంధనాత్ ।
సర్వోపదేష్టుః పురుషోత్తమస్య
తస్యాఙ్ఘ్రి పద్మం ప్రణతోస్మి నిత్యం ॥ 24

పరమాత్మ స్వరూపుడైన యే ఆచార్యుని అనుగ్రహమునుచే నేను సంసారబంధములైన కర్మలనుండి విముక్తి బొందితినో యట్టి సర్వజనోపదేశకుడగు శ్రీకృష్ణుని పాదారవిందములకు నిత్యము ప్రణామము సేయుచున్నాను.

( 4 )

## 3

వందే మురారేశ్చరణారవింద
ద్వన్ద్వం దయాదర్శితశైశవస్య
వందారు బృందారక బృందమౌళి
మందారు మాలా వినిమర్దభీరు ॥ 1

లీలావతారుడు బాలుడై యవతరించి బాల్యలీలలు నెఱపు శ్రీకృష్ణమూర్తికి వందన మాచరించు దేవతా సమూహముల శిరంబులందుండి వారలంకరించిన కల్పవృక్ష పుష్ప మాలికల సముదాయపు రాపిడికి దాళలేక గొంకుచున్న యతని పాదారవింద యుగళమునకు నమస్కరించుచున్నాను.

అరుణాధరామృత విశేషితస్మితం
వరుణాలయానుగత వర్ణవైభవం ।
తరుణారవిందదళ దీర్ఘలోచనం
కరుణామయం కమపి బాలమాశ్రయే ॥ 2

ఎఱ్ఱనై యమృతమువలె అతి భోగ్యమైయుండు అధరమునందు దొలకుటచే మఱింత సొగసుగూడిన చిరునవ్వు గలవాడును, సముద్రము ననుకరించు కాంతిగలవాడును, లేదామర రేకులవలెను నేత్రములుగలవాడును, కరుణాస్వరూపుడును, వాచామగోచరుడును అగు బాలశ్రీకృష్ణు నాశ్రయించుచున్నాను.

మధురిమభరతే మనోభిరామే
మృదులతస్మిత ముద్రితాననేన్దే ।
త్రిభువన నయనైకలోచనీయే
మహసివయంవ్రజభాజిలాలసాస్మః ॥ 3

అతి సౌందర్యముగలిగి, మనసున్నన కింపైన చిరునగవు తొలుకు చంద్రుని మోము నొప్పారు, ముల్లోకములవారికిని మిక్కిలి యాసతో జూడదగు మోహానమై, సౌలభ్యముగా వ్రజభూమిపై యున్న తేజస్వరూపుడగు శ్రీకృష్ణునియందు మాకు మిక్కిలి యాసక్తి గలిగినది.

నయనాంబుజే భజతు కామదుఘం
హృదయాంబుజే కిమపి కారుణికమ్ ।
చరణాంబుజే మునికులై కధనం
వదనాంబుజే వ్రజవధూవిభవం ॥ 4

కనుదామరులచూడ్కులు నిగుడ్చుట చేతను, సమస్త కోర్కెల నీడేర్చువాడును, హృదయమందు యెనలేని కరుణ గలవాడును, మునిహృదయములు సదా మననముచేయు నిధియగు పాదారవిందములుగలవాడును, గోపికల ఐశ్వర్యము వోలె సొంపగు సుందర ముఖారవిందముగలవాడునగు శ్రీకృష్ణుని భజింపుడు.

యద్గోపీవదనేన్దు మండనమభూత్కస్తూరి కాపత్రకం
యల్లక్ష్మీకుచశాతకుమ్భ కలశ వ్యాకోశమిందీవరం ।
యన్నిర్వాణ విధానసాధన విధేసిద్ధాంజన యోగినాం
తన్నశ్యామల మావిరస్తు హృదయే కృష్ణాభిధానంమహః ॥ 5

చంద్రబింబమువంటి ముఖారవిందముగల గోపికలకు కస్తూరి బొట్టువలె సొగసుచూపునో, ఏది శ్రీ లక్ష్మీదేవి బంగారుకుచకుండలములందువికసించిన నల్ల కలువలను బోలునో, ఏది యోగుల ముక్తియనెడి నిధిని దెలుపు సిద్ధాంజనమువలె నుండునో, కృష్ణుడనెడి యా నీలమేఘ తేజము మా హృదయములందు ప్రకాశించుగాక !

యన్నాభీసరసీరుహాన్తరపుటే భృంగాయమాణో విధిః
యద్వక్షః కమలావిలాస సదనం యచ్చక్షుషీ చేన్ద్వినే ।
యత్పాదాబ్జ వినిస్సృతా సురనదీ శంభోశ్శిరోభూషణం
యన్నామ స్మరణం ధునోతి దురితం పాయాత్సనః కేశవః ॥ 6

ఎవ్వని నాభి దామరలోపల బ్రహ్మ, తుమ్మెదవలె జూపట్టునో, ఎవ్వని వక్షస్తలము శ్రీమహాలక్ష్మికి ఆలవాలమై విలాసమందిరమైనదో, ఎవ్వని నేత్రములు రెండును – సూర్య, చంద్రులో ఎవ్వని పాదారవిందమునుండి ఉద్భవించిన గంగ శివుని శిరసు నలంకరించినదో, ఎవ్వని నామము స్మరింపగా పాపములు పటాపంచలగునో ఆ శ్రీకృష్ణపరమాత్మ మమ్ము రక్షించుగాక !

వంద్యం దేవైర్ముకుందం వికసితకురువిందాభమిందీవరాక్షం
గోగోపీబృంద వీతం జితరిపునివహం కుందమందారహాసం ।
నీలగ్రీవాగ్ర్యపిఞ్ఛగ్రథన సువిలసత్కుంతలం భానుమంతం
దేవం పీతాంబరాఢ్యం యజయజ దినశోమధ్యమాహేన్నరమాత్రైః॥

కృష్ణప్రభువు సమస్తదేవతలకు వందనీయుడు, వికసించిన కురువింద పుష్పముయొక్క కాంతిగలవాడు, పద్మదళముల వంటి నేత్రములు గలవాడు, గోవులయొక్క, గోపికలయొక్క సమూహాముచేత వ్యాపించినవాడు, జయించిన శత్రువులగుంపు గలవాడు, మల్లికా, మందార పుష్పములవంటి నవ్వుగలవాడు, శిరస్సున నెమిలిఫింఛమును ధరించుటచేత ప్రకాశించుచున్న వెంట్రుకలుగలవాడు, పీతాంబరమును ధరించిన శ్రీకృష్ణుని సేవించెదమని నిత్యము యోచింపవలెను.

యా ప్రీతిర్విదురార్పితే మురరిపో కున్త్యర్పితే యాదృశో
యాగోవర్ధనమూర్ధ్ని యా చ పృథుకే స్తన్యేయశోదార్పితే ।
భారద్వాజ సమర్పితే శబరికాదత్తే ధరే యోషితాం
యా ప్రీతిర్మునిపత్ని భక్తిరచితే వ్యత్రాపితాం తాంకురు ॥ 8

ఓకృష్ణా ప్రీతితో విదురుడు సమర్పించిన ఆహారమందును, కుంతిదేవి యొసగిన భోజనమందును, యశోద ప్రేమతో గుడిపిన చనుబాలయందును, భారద్వాజుడుచేసిన విందునందును, శబరి యొసగిన ఫలములందును, ముని భార్యలు సమర్పించిన యన్నమందును ఏ ప్రీతి నీకుండెనో అట్టి ప్రీతి యీ కర్ణామృతమందు నెఱపుము.

కృష్ణాను స్మరణాదేవ
పాపసంఘాత పంజరః ।
శతధాభేద మాయాతి
గిరిర్వజ్ర హతోయథా ॥ 9

వజ్రాయుధముచే కొండ వంద ముక్కలగునట్లు, కృష్ణుని సదా స్మరించుటచే బంధకమైన పాపసమూహములెల్లను పటాపంచలగును.

ooo○ooo

# మధ్యమావతిరాగము - ఆదితాళము

ప॥ మదనగోపాల తే మంగళం - మందరధర తే మంగళం
॥ మదన ॥

1. శ్రీరమణీకుచ కుంకుమపంకవి - లిప్తవిశాలభుజాంతర
వారిజలోచనవల్లవయువతీ - జారసదా తే మంగళం ॥

2. కుండలయుగళీ మండిత మృదుతర - గండస్థల తే మంగళం
భండనసముదితచండపురాసుర - ఖండనచర తే మంగళం ॥

3. రంగదభంగపరాక్రమసంగత - గంగాధర తే మంగళం
[1] అంగజజనక [2] భుజంగమతుంగ తట-రంగశయన తే
మంగళం ॥

4. దినకరమండలమధ్యగ సంతత - వినతామర తే మంగళం
[3] వనజభవార్చిత పాదసరోరుహ-మునిజనహిత తే మంగళం॥

5. [4] సామజపోషణ శత్రువిభీషణ - సంభృతకౌస్తుభ భూషణ
కామితదాయక కమలనాయక - సోమాన్వయ తే మంగళం॥

---

1. మన్మథ జనక
2. ఆదిశేషునిపై శయనించు
3. చతుర్ముఖబ్రహ్మచే పూజింపబడువాడు
4. గజేంద్ర రక్షకా !

# శ్రీ సత్యనారాయణాష్టోత్తర శతనామావళి

( ప్రతి నామమునకు ముందు 'ఓం' అని, చివర 'నమః' అని చేర్చుకొని పలకవలయును. )

ఓం నారాయణాయ నమః
నరాయ
శౌరయే
చక్రపాణయే
జనార్దనాయ
వాసుదేవాయ
జగద్యోనయే
వామనాయ
జ్ఞానపంజరాయ
శ్రీవల్లభాయ 10
జగన్నాథాయ
చతుర్మూర్తయే
వ్యోమకేశాయ
హృషీకేశాయ
శంకరాయ
గరుడధ్వజాయ
నారసింహాయ
మహాదేవాయ
స్వయంభువే
భువనేశ్వరాయ 20
శ్రీధరాయ

ఓం దేవకీపుత్రాయ నమః
పార్థసారథయే
అచ్యుతాయ
శంఖపాణయే
పరంజ్యోతిషే
ఆత్మజ్యోతిషే
అచంచలాయ
శ్రీవత్సాంకాయ
అఖిలాధారాయ 30
సర్వలోకపతిప్రభవే
త్రివిక్రమాయ
త్రికాలజ్ఞాయ
త్రిధామ్నే
కరుణాకరాయ
సర్వజ్ఞాయ
సర్వాంగాయ
సర్వస్మై
సర్వేశాయ
సర్వసాక్షిణే 40
హరయే
శార్ఙ్గిణే

ఓం హరయే నమః
శేషాయ
హలాయుధాయ
సహస్రబాహవే
అవ్యక్తాయ
సహస్రాక్షాయ
అక్షరాయ
క్షరాయ 50
గజారిఘ్నాయ
కేశవాయ
కేశిమర్దనాయ
కైటభారయే
అవిద్యారయే
కామదాయ
కమలేక్షణాయ
హంసశత్రవే
అధర్మశత్రవే
కాకుత్థ్సాయ 60
ఖగవాహనాయ
నీలాంబరద్యుతయే
నిత్యాయ
నిత్యతృప్తాయ

ఓం నిత్యానందదాయ నమః
సురాధ్యక్షాయ
నిర్వికల్పాయ
బ్రహ్మణ్యాయ
నిరంజనాయ
పృథివీనాథాయ 70
పీతవాససే
గుహాశయాయ
వేదగర్భాయ
విభవే
విష్ణవే
శ్రీమతే
త్రైలోక్యభూషణాయ
యజ్ఞమూర్తయే
అమేయాత్మనే
వరదాయ 80
వాసవానుజాయ
జితేంద్రియాయ
జితక్రోధాయ
సమదృష్టయే
సనాతనాయ
భక్తప్రియాయ

ఓం జగత్పూజ్యాయ నమః
పరమాత్మనే
అసురాంతకాయ
సర్వలోకానామంతకాయ 90
అనంతాయ
అనంతవిక్రమాయ
మాయాధారాయ
నిరాధారాయ
సర్వాధారాయ
ధరాధరాయ
నిష్కళంకాయ

ఓం నిరాభాసాయ నమః
నిష్ప్రపంచాయ
నిరామయాయ 100
భక్తవశ్యాయ
మహోదారాయ
పుణ్యకీర్తయే
పురాతనాయ
త్రికాలజ్ఞాయ
విష్టరశ్రవసే
చతుర్భుజాయ 107
శ్రీసత్యనారాయణ
స్వామినే నమః

— o —

# శ్రీ దత్తాత్రేయాష్టోత్తర శతనామావళి

( ప్రతి నామమునకు ముందు 'ఓం' అని, చివర 'నమః' అని చేర్చుకొని పలుకవలయును. )

ఓం శ్రీదత్తాయ నమః
దేవదత్తాయ
బ్రహ్మదత్తాయ
విష్ణుదత్తాయ
శివదత్తాయ
అత్రిదత్తాయ
అత్రివరదాయ
ఆత్రేయాయ
అనసూయసూనవే
అనసూయాయై
అవధూతాయ
ధర్మాయ
ధర్మపరాయణాయ
ధర్మపతయే
సిద్ధాయ
సిద్ధిదాయ
సిద్ధపతయే
సిద్ధసేవితాయ
గురవే
గురుగమ్యాయ
గురోర్గురుతరాయ

ఓం గరిష్ఠాయ నమః
వరిష్ఠాయ
మహిష్ఠాయ
మహాత్మనే
యోగాయ
యోగగమ్యాయ
యోగదేశకరాయ
యోగపతయే
యోగీశాయ
యోగాధీశాయ
యోగపరాయణాయ
యోగిధ్యేయాంఘ్రిపంకజాయ
దిగంబరాయ
దివ్యాంబరాయ
పీతాంబరాయ
శ్వేతాంబరాయ
చిత్రాంబరాయ
బాలాయ
బాలవీర్యాయ
కుమారాయ
కిశోరాయ

ఓం కందర్పమోహనాయనమః ఓం శూలినే నమః

అర్థాంగాలింగితాంగనాయ
సురాగాయ
విరాగాయ
వీతరాగాయ
అమృతవర్షిణే
ఉగ్రాయ
అనుగ్రహరూపాయ
స్థవిరాయ
స్థవీయసే
శాంతాయ
అఘోరాయ
మూఢాయ
ఊర్ధ్వరేతసే
ఏకవక్త్రాయ
అనేకవక్త్రాయ
ద్వినేత్రాయ
త్రినేత్రాయ
ద్విభుజాయ
షడ్భుజాయ
అక్షమాలినే
కమండలధారిణే

డమరుధారిణే
శంఖినే
గదినే
మునయే
మాలినే
విరూపాయ
స్వరూపాయ
సహస్రశిరసే
సహస్రాక్షాయ
సహస్రబాహవే
సహస్రాయుధాయ
సహస్రపాదాయ
సహస్రపద్మార్చితాయ
పద్మహస్తాయ
పద్మపాదాయ
పద్మనాభాయ
పద్మమాలినే
పద్మగర్భారుణాక్షాయ
పద్మకింజల్కవర్చసే
జ్ఞానినే
జ్ఞానగమ్యాయ

ఓం జ్ఞానవిజ్ఞానమూర్తయేనమః ఓం అష్టయిశ్వర్యప్రదానాయ

| | | |
|---|---|---|
| ధ్యానినే | వరదాయ | నమః |
| ధ్యాననిష్ఠాయ | వరీయసే | |
| ధ్యానస్తిమితమూర్తయే | బ్రహ్మణే | |
| ధూళిధూసరితాంగాయ | బ్రహ్మరూపాయ | |
| చందనలిప్తమూర్తయే | విష్ణవే | |
| భస్మోద్ధూళితదేహాయ | విశ్వరూపిణే | |
| దివ్యగంధానులేపినే | శంకరాయ | |
| ప్రసన్నాయ | ఆత్మనే | |
| ప్రమత్తాయ | అంతరాత్మనే | |
| ప్రకృష్టార్థప్రదాయ | పరమాత్మనే | |

ఓం దత్తాత్రేయాయ నమోనమః 108

— ० —

# శ్రీ షిర్డిసాయిబాబా అష్టోత్తర శతనామావళి

( ప్రతి నామమునకు ముందు 'ఓం' అని, చివర 'నమః' అని చేర్చుకొని పలకవలయును. )

ఓం శ్రీసాయినాథాయ నమః
లక్ష్మీనారాయణాయ
శ్రీకృష్ణరామ మారుత్యాది రూపాయ
శేషశాయినే
గోదావరీతటషిరిడీవాసినే
భక్తహృదాలయాయ
సర్వహృద్వాసినే
భూతావాసాయ
భూతభవిష్యద్భావవర్జితాయ
కాలాతీతాయ 10
కాలాయ
కాలాకాలాయ
కాలదర్పదమనాయ
మృత్యుంజయాయ
అమర్త్యాయ
మర్త్యాభయప్రదాయ
జీవాధారాయ
సర్వాధారాయ
భక్తావనసమర్థాయ
భక్తావనప్రతిజ్ఞాయ 20

ఓం అన్నవస్త్రప్రదాయ నమః
ఆరోగ్యక్షేమదాయ
ధనమాంగల్యదాయ
బుద్ధిసిద్ధిదాయ
పుత్రమిత్రకళత్రబంధుదాయ
యోగక్షేమవహాయ
ఆపద్బాంధవాయ
మార్గబంధవే
భుక్తిముక్తిస్వర్గాపవర్గదాయ
ప్రియాయ 30
ప్రీతివర్ధనాయ
అంతర్యామినే
సచ్చిదాత్మనే
ఆనందదాయ
పరమేశ్వరాయ
పరబ్రహ్మణే
పరమాత్మనే
జ్ఞానస్వరూపిణే
జగతఃపిత్రే

ఓం భక్తానాంమాతృదాతృపితా
మహాయ నమః
భక్తాభయప్రదాయ
భక్తపరాధీనాయ
భక్తానుగ్రహకాతరాయ
శరణాగతవత్సలాయ
భక్తిశక్తిప్రదాయ
జ్ఞానవైరాగ్యదాయ
శ్రేయప్రదాయ
సంశయహృదయదౌర్బల్య
పాపకర్మవాసనాక్షరాయ
హృదయగ్రంధిభేదకాయ
కర్మవిధ్వంసినే
శుద్ధసత్వస్థితాయ
గుణాతీతగుణాత్మనే
అనంతకళ్యాణగుణాయ
అమితపరాక్రమాయ
జయినే
దుర్ధర్షాక్షోభ్యాయ
అపరాజితాయ
త్రిలోకేషుఅవిఘాతగతయే
అశక్యరహితాయ

ఓం సర్వశక్తిమూర్తయే నమః
సురూపసుందరాయ
సులోచనాయ
బహురూపవిశ్వమూర్తయే
అరూపవ్యక్తాయ
చింత్యాయ
సూక్ష్మాయ
సర్వాంతర్యామినే
మనోవాగాతీతాయ
ప్రేమమూర్తయే
సులభదుర్లభాయ
అసహాయసహాయాయ
అనాధనాధదీనబంధవే
సర్వభారభృతే
అకర్మానేకకర్మసుకర్మిణే
పుణ్యశ్రవణకీర్తనాయ
తీర్థాయ
వాసుదేవాయ
సతాంగతయే
సత్పరాయణాయ
లోకనాథాయ
పావనానఘాయ

ఓం అమృతాంశవే నమః
భాస్కరప్రభాయ
బ్రహ్మచర్యతపశ్చర్యాది సువ్రతాయ
సత్యధర్మపరాయణాయ
సిద్ధేశ్వరాయ
సిద్ధసంకల్పాయ
యోగేశ్వరాయ
భగవతే
భక్తవత్సలాయ
సత్పురుషాయ
పురుషోత్తమాయ
సత్యతత్త్వబోధకాయ
కామాదిషడ్వైరిధ్వంసినే
అభేదానందానుభవప్రదాయ

ఓం సర్వమతసమ్మతాయ నమః
దక్షిణామూర్తయే
శ్రీ వేంకటేశరమణాయ
అద్భుతానందచర్యాయ
ప్రపన్నార్తిహరాయ
సంసారసర్వదుఃఖక్షయకారకాయ
సర్వవిత్సర్వతోముఖాయ
సర్వాంతర్బహిస్థితాయ
సర్వమంగళకరాయ
సర్వాభీష్టప్రదాయ
సమరససన్మార్గస్థాపనాయ
శ్రీ సమర్థసద్గురు సాయినాథాయ నమః

—o—